# కృష్ణశతకము.

టీకాతాత్పర్యసహితము.

(పండితపరిశోధితము).

ప్రచురణకర్తలు:—

సీతారాం అండ్ కో.,
పబ్లిషర్సు, బుక్ సెల్లర్సు,
తెనాలి.

1000 ప్రతులు.

శ్రీ మారుతి ముద్రాక్షరశాల, తెనాలి.

 [Price As. 2

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః



# కృష్ణ శతకము.

క॥ శ్రీరుక్మిణీశ కేశవ
నారద సంగీతలోల • నగధర శౌరీ
ద్వారకనిలయ జనార్దన
కారుణ్యముతోడ మమ్ముఁ • గావుము కృష్ణా. 1

అర్థము — శ్రీరుక్మిణీశ=రుక్మిణీదేవికి భర్తయైనవాఁడా; కేశవ=కేశవా; నారద=నారదునియొక్క, సంగీత=సంగీతమునందు; లోల=మునిఁగియుండు వాఁడా; నగధర=కొండను చేతియందు దాల్చినవాఁడా; శౌరీ=విష్ణుమూర్తీ; ద్వారకనిలయ=ద్వారకాపురమునందు వసించువాఁడా; జనార్దన=జనార్దనుఁడా; కారుణ్యముతోడ=దయతోడ; మమ్ము=మము; కావుము=రక్షింపుము; కృష్ణా.

తాత్పర్యము — రుక్మిణికి భర్తవు, కేశవుఁడవు, నారదుని సంగీతము నందు మునిగి యుండువాఁడవును, ద్వారకయందుండు వాఁడవును, జనార్దనుఁడవును అగు, ఓ కృష్ణా! నీవు మమ్ము దయతో రక్షింపుము.

క॥ నీవే తల్లివి దండ్రివి
నీవే నాతోడునీడ • నీవే సఖుఁడౌ
నీవే గురుఁడవు దైవము
నీవే నా పతియు గతియు • నిజముగ కృష్ణా. 2

తా—ఓకృష్ణా! నాకు నీవే తండ్రివి, తల్లివి, తోడునీడ, మిత్రుఁడవు, గురుఁడవు, దైవము, అధిపతివి, దిక్కునై యున్నావు.

క॥ నారాయణ పరమేశ్వర
ధారాధర నీలదేహ • దానవవైరీ
క్షీరాబ్ధి శయనయదుకుల
వీరానను గావు కరుణ • వెలయఁగ కృష్ణా. 3

అ—నారాయణ= నారాయణా; పరమేశ్వర = పరమేశ్వరుఁడా; ధారాధర = మేఘమువంటి; నీల=నల్లనైన; దేహ = దేహముగలవాఁడా; దానవ = రాక్షసులకు; వైరీ=విరోధియైనవాఁడా; క్షీరాబ్ధి = పాలసముద్రమునందు; శయనా = పవ్వళించువాఁడా; యదుకుల = యాదవకులమునందు; వీరా=వీరుఁడా; నను; కావుము=రక్షింపుము; కరుణవెలయఁగ=దయతోడ కృష్ణా!

తా—ఓనారాయణా! పరమేశ్వరా! మేఘమువలెనల్లనైన శరీరముగలవాఁడా! రాక్షసులకు పగవాఁడా! పాలసముద్రమున శయనించువాఁడా! యదుకులమునందు వీరుఁడా! నన్ను దయతోరక్షింపుము.

క॥ హరియను రెండక్షరములు
హరియించును పాతకముల • నంబుజనాభా
హరి నీనామమహత్త్వము
హరిహరి పొగడంగవశమె • హరిశ్రీ కృష్ణా. 4

అ॥ హరియను రెండక్షరములు=హరియను పదములోనున్న రెండక్షరములు; హరియించును=పోఁగొట్టును; పాతకముల=పాపములను; అంబుజనాభా=బొడ్డునందుపద్మముగలవాఁడా; హరి; నీనామ=నీపేరుయొక్క; మహత్త్వము=మహిమ; హరిహరి; పొగడంగ=నుతింప; వశమా=శక్యమా; హరిశ్రీ కృష్ణా.

తా—ఓహరీ! నీపేరునందున్న రెండక్షరములు స్మరించినచో పాపములు పోవును. నీనామము యొక్క మహిమపొగడుటకు నాకు శక్యమగునా!

క॥ క్రూరాత్ముఁ డజామీళుఁడు
నారాయణ యనుచు నాత్మ • నందను బిలువ
న్నేరీతి నేలుకొంటివి
యేరీనీపాటివేల్పు • లెందున కృష్ణా. 5

అ—క్రూరాత్ముఁడు=క్రూరబుద్ధిగల; అజామీళుఁడు=అజామీళుఁడను వాఁడు; నారాయణ యనుచు = నారాయణాయని; ఆత్మనందను= తనకుమారుని; పిలువన్=పిలువగా; ఏరీతి = ఏవిధముగా; ఏలుకొంటివి= రక్షించితివి; ఏరీ=ఎవ్వరున్నారు, నీపాటి=నీకుసమానమైన; వేల్పులు= దైవములు; ఎందున=ఎక్కడనైనా; కృష్ణా!

తా—అజామీళుఁడు క్రూరుఁడవిరైనను తలఁపక, తన కొడుకునకు నారాయణాయని నీపేరుపెట్టుకొని పిలిచిన మాత్రమున రక్షించితివి, కృష్ణా! నీకుసరియైన దైవమెవ్వఁడును లేఁడు.

క॥ చిలుకల కొలికియు ముద్దుల
చిలుకను శ్రీరామ యనుచు • శ్రీపతిపేరం
బిలిచిన మోక్షము నిచ్చితి
వలరగ మిము దలచు జనుల • కరుదా కృష్ణా. 6

అ—చిలుకల కొలికియు=ఒకస్త్రీ; ముద్దుల చిలుకను=తాను ముద్దుగా పెంచిన చిలుకను; శ్రీరామయనుచు = శ్రీరామాయని, శ్రీపతి పేరం= విష్ణుమూర్తిపేర; పిలిచిన=పిలువగా; మోక్షము; ఇచ్చితివి; అలరఁగ= ఒప్పుగా; మిము=మిమ్ములను; తలఁచు=స్మరించు; జనులకు; అరుదా=కొఱత యుండునా; కృష్ణా!

తా—కృష్ణా! తాను పెంచినచిలుకను శ్రీరామా యని యొక స్త్రీ పిలిచినంతమాత్రమున నామెకు ముక్తి నిచ్చితివి. నిన్నుఁ గొలిచిన వారికేవిధమైన కొఱఁతయు నుండదుకదా!

క॥ అక్రూరవరద మాధవ
చక్రాయుధ ఖడ్గపాణి • శౌరిముకుందా
శక్రాది దివిజసన్నుత
శుక్రార్చితనన్ను గరుణ • జూడుము కృష్ణా. 7

అ—అక్రూర=అక్రూరుని; వరద=రక్షించినవాఁడా; మాధవ=లక్ష్మీదేవికిభర్తయైనవాఁడా; చక్రాయుధ=చక్రము నాయుధముగా గలిగినవాఁడా; ఖడ్గపాణి=హస్తమునఁ గత్తి గలిగినవాఁడా; శౌరీ; ముకుందా=ఈరెండు పదములును విష్ణుమూర్తికి నామములై యున్నవి; శక్రాది=ఇంద్రుఁడు మొదలైన; దివిజ=దేవతలచేత; సన్నుత=పొగడఁబడెడువాఁడా; శుక్రార్చిత=శుక్రునిచేత పూజింపఁబడువాఁడా; నను; కరుణ=కృపతోడ; చూడుము. కృష్ణా!

తా—అక్రూరుని రక్షించిన వాఁడవును లక్ష్మికిభర్తయైనవాఁడవును చక్రాయుధుఁడవును, ఖడ్గపాణివి, ఇంద్రాది దేవతలచే సన్నుతింపఁబడెడు వాఁడవును, శుక్రునిచే పూజింపఁబడు వాఁడవును నైన; ఓకృష్ణా! నన్నుకృపతో చూడుము.

క॥ నందుని ముద్దుల పట్టిని
మందరగిరి ధరుసిహరిని • మాధవు విష్ణున్
సుందరరూపుని మునిగణ
వందితుమిము దలతుభక్త • వత్సల కృష్ణా. 8

అ—నందుని=నందునియొక్క; ముద్దులపట్టిని=ముద్దులకొడుకును; మందరగిరి=మందరపర్వతమును, ధరుని = దాల్చినవానిని; హరిని = హరిని; మాధవు=శ్రీపతిని; విష్ణుఁ=నారాయణుని; సుందరరూపుని=అందమైనరూపము గలవానిని; మునిగణ=మునిబృందము చేత; వందితు=స్తోత్రము చేయబడువానిని; మిము=మిమ్ము; తలతు=స్మరించెదను; భక్తవత్సల=భక్తులయందు దయగలవాఁడా; కృష్ణా—

తా॥ భక్తులయందు దయగల యో కృష్ణా! నందుని ముద్దుకొడుకువును, మందర మెత్తినవాడవును, లక్ష్మీదేవికి మగఁడవును, అందమైన రూపముగలవాడవును, మునులచే స్తోత్రము చేయబడువాడవును - నగు నిన్ను స్మరించెదను.

క॥ ఓ కారుణ్య పయోనిధి
నాకాధారంబవగుచు • నయముగ బ్రోవ
న్నా కేల యితర చింతలు
నాకాధిపవినుతలోక • నాయక కృష్ణా.

అ॥ ఓ కారుణ్య (దయకు) పయోనిధి = దయకు సముద్రమువంటి వాఁడా; నాకు=నాకు; ఆధారంబవగుచు(ఆధారంబవు + అగుచు)=దిక్కై; నయముగ=బాగుగా; బ్రోవఁగ = బ్రోచుచుండగా; నాక=నాకు; ఏల=ఎందుకు; ఇతరచింతలు=తక్కిన ఆలోచనలు; నాకాధిప=నాకలోకమునకు రాజైన యింద్రునిచేత; వినుత=పొగడబడెడు; లోకనాయక=సర్వ లోకములకు నాయకుఁడైనవాఁడా; కృష్ణా—

తా॥ ఇంద్రునిచేత పొగడబడు లోకనాయకుండవగు నో కృష్ణా! ఓ దయా సముద్రుఁడా నీవు నాకుదిక్కై నన్ను రక్షించుచుండగా, నితర చింత లెందుకు?

క॥ వేదంబులు గననేరని
యాదిపరబ్రహ్మమూర్తి • యనఘ మురారీ
నాదిక్కు జూచి కావుము
నీ దిక్కే నమ్మినాడ • నిజముగ కృష్ణా 10

అ॥ వేదంబులు=వేదశాస్త్రములు; కననేరని=చూడఁజాలని; ఆది పరబ్రహ్మమూర్తీ=సమస్తదేవతలకును మొదటివేల్పయినవాఁడా; అనఘ=గొప్పవాఁడా; మురారీ=(ముర + అరి)=మురుడను రాక్షసునకుబగవాఁడా; నాదిక్కు జూచి=నన్ను జూచి; కావుము=రక్షింపుము; నీదిక్కే=నాకు నీవే దిక్కని; నమ్మినాడ; నిజముగ=సత్యముగ; కృష్ణా—

తా॥ వేదములైనను చూడఁజాలని యాదిదేవుఁడవైన ఓ కృష్ణా! నీవే దిక్కని నిజముగా నమ్మియున్న నన్ను రక్షింపుము

క॥ పదునాలుగు భువనంబులు
కుదురుగ నీ కుక్షి నిల్పు • కొన నేర్పరివై
విదితంబుగ యా దేవకి
యుదరములో నెట్టులొదిగి • యుంటివి కృష్ణా 11

అ॥ పదునాలుగు భువనంబులు=పదునాలుగు లోకములు; కుదురుగ; నీకుక్షి=నీకడుపునందు; నిల్పుకొన=దాచుటకు; నేర్పరివై=సమర్థుండవై యుండియు; విదితముగ=బాగుగ; ఆదేవకి=(నీకు) తల్లియైన యాదేవకి; యుదరములో=కడుపులో; ఎట్టులు=ఎట్లు; యొదిగియుంటివి=అడఁగియుం టివి; కృష్ణా—

తా॥ కృష్ణా. పదునాల్గులోకముల నీకుక్షియందు నిలిపిన నీవు దేవకి గర్భమున నెట్లొదిగియుంటివి?

క॥ అష్టమిరోహిణి ప్రొద్దున
యష్టమ గర్భమునఁ బుట్టి • యాదేవకికిం

దుష్టునికంసు వధింపవె
సృష్టి ప్రతిపాలనంబు సేయఁగకృష్ణా. 12

అ—అష్టమి=అష్టమి దినమున; రోహిణిప్రొద్దున=రోహిణీ నక్షత్రమున; అష్టమ గర్భమున=ఎనిమిదవ చూలున; పుట్టి=జనించి; ఆదేవకికిం-ఆదేవకిదేవికి; దుష్టుని=దురాత్ముని; కంసు=కంసుడను రాక్షసుని; వధింపవె=చంపవె; సృష్టి=ప్రపంచము; ప్రతిపాలనంబు= పరిపాలనము; సేయఁగ=చేయుటకు; కృష్ణా.

తా—కృష్ణా అష్టమీదిన రోహిణీ నక్షత్రమున నెనిమిదవ గర్భమున దేవకికి బుట్టి ప్రపంచము పరిపాలించుటకు కంసుని జంపితవి కదా!

క॥ అల్ల జగన్నాథుని రే
పల్లియ క్రీడార్థమయ్యె ♦ పరమాత్మునకున్
గొల్లసతి యాయశోదయు
తల్లియునై చన్నుగుడిపె ♦ దనరఁగకృష్ణా. 13

అ—అల్ల=అ; జగన్నాథుని=లోకనాయకుని; రేపల్లియ=రేపల్లె; క్రీడార్థమయ్యె = ఆడుకొనుటకు దగినదయ్యె; పరమాత్మునకున్ = పరమాత్ముఁడయిన కృష్ణునకు; గొల్లసతి = గొల్లవానిభార్య; ఆయశోదయు=ఆయశోద; తల్లియునై = తల్లియై; చన్నుగుడిపె = పాలనిచ్చెను; కృష్ణా! దనరఁగ = ఒప్పుగా.

తా—కృష్ణా! పరమాత్ముఁడైననీకు రేపల్లెక్రీడాప్రదేశమయ్యె. గొల్లసతితల్లియయ్యెను.

క॥ అందెలు గజ్జెలు మ్రోయఁగ
చిందులు ద్రొక్కుచును వేడ్క ♦ చెలువారంగా
సందునిసతి యాగోపిక
ముందర నాడుదువు మిగుల ♦ మురియుచుకృష్ణా 14

అ—అందెలు; గజ్జెలు; మ్రోయగ = ధ్వనియియ్య; చిందులు ద్రొక్కుచు = గంతులువేయుచు; వేడ్క = సంతోషము; చెలువారంగా = కలుగునట్లు; నందుని = నందునియొక్క; సతి = భార్యయైన; అగోపిక; ముందర; నాడుదువు; మిగుల = మిక్కిలి; మరియుచు = నవ్వుచు; కృష్ణా

తా—కృష్ణా! నీవుఅందెలును గజ్జెలును చప్పుడగునట్లు అనందుని భార్యయైన గోపికకు సంతోషము గలుగునట్లు నవ్వుచుగంతులు వేయుచు నాడుదువుకదా.

క॥ హరిచందనంబు మేనున
కరమొప్పెడు హస్తములను • కంకణరవముల్
యురమున రత్నము మెరయుగ
బరగినదో నీదు బాల్య • వయసది కృష్ణా. 15

అ—హరిచందనము = గంధము; మేనున = శరీరమున; కరమొప్పెడు = కోరికనించెడు; హస్తములను = చేతులను; కంకణరవముల్ = కంకణముల ధ్వనియు; ఉరమున = వక్షమున; రత్నము; మెరయుగ = ప్రకాశింపగా; పరగినదో = యొప్పినదికదా; నీదు = నీయొక్క; బాల్యవయసది; (బాల్య + వయసు + అది) చిన్నతనము.

తా—కృష్ణా! చిన్నతనమున నీశరీరము గంధముచేతను, హస్తములు కంకణములచేతను, వక్షమురత్నముచేతను ప్రకాశించినదికదా.

క॥ పాణితలంబున వెన్నయు
వేణీమూలంబునందు • వెలయగపింఛం
బాణిముత్యము ముక్కున
నాణెముగా దాల్చులోక • నాథుడ కృష్ణా 16

అ—పాణితలంబున = చేతియందు; వెన్నయు; వేణీమూలంబున = జడము ముందుభాగమున; వెలయగ = యొప్పగ; పింఛంబు = పింఛమును; ఆణి

ముత్యము = మంచిముత్యము; ముక్కున; నాణెముగా = బాగుగా; దాల్చు = ధరించు; లోకనాథుఁడ = లోకముల కర్తవు; కృష్ణా,

తా—కృష్ణా నీవు చేతియందు వెన్నయు, వేణియందు పింఛమును, ముక్కున మంచిముత్యమును దాల్చు లోకనాయకుఁడవు.

క॥ మడుగునఁ జని కాళింగుని
పడగలపై భరతశాస్త్ర • పద్ధతి నెలయం
గడు వేడుకతో నాడెడు
నడుగులు నే మదిని దలఁతు • నచ్యుతకృష్ణా. 17

అ. మడుగున = చెఱువునను; చని = వెళ్లి; కాళింగుని = కాళీయుఁడను పేరుగల సర్పముయొక్క; పడగలపై = ఫణములపైన; భరతశాస్త్రపద్ధతి = నాట్యశాస్త్రమునఁ జెప్పఁబడిన విధమున; వెలయం = యొప్పగా; కడు = మిక్కిలి; వేడుకతో = సంతోషముతో; నాడెడు; నడుగులు = పదములు; నే = నేను; మదిని = మనస్సులో: తలఁతు; అచ్యుత = (విష్ణుమూర్తికి పేరు) కృష్ణా

తా॥ కృష్ణా! మడుగునందు కాళీయుని శిరముపై నాట్యముసల్పిన నీయడుగుల నేను తలంతును.

క॥ బృందావనమున బ్రహ్మా
నందార్భకమూర్తి వేణు • నాదము నీవుఁ
మందారమూలమున గో
విందా పూరింతువౌర వేడుక కృష్ణా. 18

అ. బృందావనమున = బృందావనములో; బ్రహ్మానందార్భకమూర్తి = ఎప్పుడును ఆనందముతోనుండు బాలుఁడా; వేణునాదము = మురళీరవము; నీవుఁ = నీవు; మందారమూలమున = మందారవృక్షము నొద్ద; గోవిం

దా + ; పూరింతువు = చేయుదువు; ఔర; వేడుక = సంతోషము తో; కృష్ణ

తా॥ కృష్ణా బృందావనములో మందారవృక్షమునొద్ద, బ్రహ్మానందస్వరూపివైన నీవు వేణునాదము సేయుదువు.

క॥ వారిజనేత్రలు యమునా
వారిని జలకంబులాడ • వచ్చిననీవుఁ
జీరలుఁ బ్రుచ్చిలి యిచ్చితి
నేరుపురా యిదియునీకు • నిజముగ కృష్ణా 19

అ. వారిజనేత్రలు= పద్మములవంటి కన్నులుగల స్త్రీలు; యమున = యమునయందలి; వారిని = నీటిలో; జలకంబులు = స్నానములు; ఆడ= చేయుటకు; వచ్చిన = రాగా; నీవుఁ = నీవు; చీరలు = కోకలు; ప్రుచ్చిలి = దొంగిలించి; యిచ్చితి = యిచ్చినాడవు; నేరుపురా; యిదియు; నీకు; నిజముగ = సత్యముగ; కృష్ణా.

తా॥ కృష్ణా! యమునలో జలకములాడవచ్చినకాంతల చీరలదొంగిలించిమరల వారికిచ్చితివి ఇదియేనా నీనేరుపు.

క॥ దేవేంద్రుఁడలుక తోడను
వావిరిగారాళ్ళవాన • వడిగురియింపం
గోవర్ధన గిరియెత్తితి
గోవుల గోపకులగాచు • కొఱకై కృష్ణా. 20

అ— దేవేంద్రుడు = ఇంద్రుఁడు (దేవతలకు అధిపతి): అలుక తోడను=కోపముతో ; వావిరిగా=దట్టముగా; రాళ్ళవాన=పాషాణవర్షము గురియింపం=గురిపింపగా; గోవర్ధనగిరి=గోవర్ధనపర్వతము; యెత్తితి=యెత్తినాడవు; గోవుల—;గోపకుల=గొల్లవాండ్ర; గాచుకొరకై=రక్షించుటకై; కృష్ణా—

తా—కృష్ణా! ఇంద్రుఁడు రాళ్ళవానఁగురిపింపఁగా గోవులను గోపకులను రక్షించుటకు గోవర్ధనపర్వత మెత్తితివికదా.

క॥ అండజవాహన విను బ్ర
హ్మాండంబుల బంతులాట • యాడెదు నీవుం
గొండల నెత్తితివందురు
కొండికపనిగాక దొడ్డ • కొండా కృష్ణా.    21

అ—అండజవాహన=(అండజము అనగా పక్షి) = పక్షివాహనము గాఁగలవాఁడా; విను—; బ్రహ్మాండంబుల=సకలలోకముల; బంతులాట—; ఆడెదు; (అనగా లోకములన్నియు బంతులుగాఁజేసి) నీవుం = నీవు; కొండల=గిరులను; ఎత్తితివి=ఎత్తినాఁడవని; అందురు=చెప్పుదురు; కొండికపనిగాక=కొంచెముపనిగాక; దొడ్డ=గొప్ప; కొండా—కృష్ణా—

తా—లోకములన్నియు బంతులాడునీవు కొండనెత్తితివని చెప్పుట యదియెంత గొప్పకార్యము—

క॥ హంసా లంబితకుండల
కంసాంతక నీవుద్వారక • కాపురిలోనన్
సంసారి రీతినుండి ప్ర
శంసార్హుఁడ వైతివహహా • జగతినికృష్ణా.    22

అ—హంసాలంబితకుండల=రత్నకుండలములచే ప్రకాశించువాఁడా; కంసాంతక=కంసుని చంపినవాఁడా; నీవు—ద్వారకాపురిలోనన్=ద్వారకాపట్టణములో; సంసారి = సామాన్య గృహస్థుని; రీతి=వలె; ఉండి—; (ప్రశంసార్హుఁడ వైతివి ప్రశంస + అర్హుఁడవు + ఐతివి) = అందఱిచేఁబొగడబడినవాఁడవైతివి; అహహా; — జగతిని=లోకమున; కృష్ణా.

తా— కృష్ణా! రత్నకుండలములచేఁ బ్రకాశించు వాఁడా! కంసుని చంపినవాఁడా! నీవు ద్వారకలో సామాన్య గృహస్థునివలెనుండి యందఱిచే బొగడబడితివి కదా.

క॥ పదియాఱు వేల నూర్వు(రు)
సు(ద)తులు నెనమం(డ్రు) నీకు • సొం(పు)గ భార్య
ల్విదితంబుగ బహురూపుల
వదలక భోగించు దైత్య • వైరివి కృష్ణా. 23

అ—పదియాఱు వేల నూర్వురు = పదియాఱు వేలపైన నొకనూరు; సుదతులు = స్త్రీలు; నెనమం(డ్రు) = ఎనిమిదిమంది; నీకు; సొంపుగ = బాగుగ; భార్యల్ = భార్యలు; విదితంబుగ = ప్రకాశమానముగ; బహురూపుల = అనేక వేషములతో; వదలక = విడువక; భోగించు = సుఖించు; దైత్యవైరివి = రాక్షసులవిరోధివి; కృష్ణా—

తా—కృష్ణా! నీవు పదియాఱు వేల నూర్వురు కాంతలను—వివాహమాడిన యెనమండుగురు భార్యలను గలిగియుండి వారితో బహురూపముల వర్తించుచుందువు—

క॥ అంగన పనుపున ధోవతి
కొంగున నటుకులను ముడుచు • కొనివచ్చిన యా
సంగతివిని దయనొసగితి
రంగుగ సంపదలు లోక • రక్షక కృష్ణా. 24

అ—అంగన = భార్య; పనుపున = పంపగా; ధోవతి—బట్ట; కొంగున = చెంగున; అటుకులను; ముడుచుకొని = ముడివేసికొని; వచ్చిన—అసంగతి = అజాడ; విని = ఎఱిగి; దయ = కృపతో; నొసగితి = ఇచ్చితివి; రంగుగ = బాగుగ; సంపదలు = భాగ్యములు; లోకరక్షక = లోకములరక్షించువాడా; కృష్ణా—

తా—లోకరక్షకుఁడవైన కృష్ణా! కుచేలుడు భార్యపంపగా తన యుత్తరీయమున నటుకులు మూటగట్టుకొని తెచ్చెనని యెఱింగి యాతనికి బహుసంపద లిచ్చితివి—

క॥ హా వసుదేవ కుమారక
కావుము నామానమనుచు • కామిని వేడ
న్నాననజాక్షికి నిచ్చితి
శ్రీవర యక్షయమటంచు • చీరలు కృష్ణా. 25

అ— హా వసుదేవ కుమారక = ఓవసుదేవుని పుత్రుడా; కావుము = రక్షింపుము; నా = నాయొక్క; మానము = పాతివ్రత్యము; అనుచు = అని; కామిని = స్త్రీయైన ద్రౌపది; వేడన్ = ప్రార్థింపగా; ఆననజాక్షికి = ఆమెకు; ఇచ్చితి = ఇచ్చితివి; శ్రీవర = లక్ష్మీనాథ; అక్షయమటంచు = తఱుగ ననుచు; చీరలు = కోకలు; కృష్ణా.

తా— కృష్ణా! నామానము గాపాడుమని ద్రౌపది వేడగా నామెకు అక్షయముగ వలువలిచ్చి రక్షించితివి.

క॥ శుభ్రమగు పాంచజన్యము
అభ్రంకషపగిది మ్రోయ • నాహవభూమిన్
విభ్రమలగు దనుజసుతా
గర్భంబులు బగులజేయు • ఘనుడవు కృష్ణా. 26

అ— శుభ్రమగు = మంచిదైన; పాంచజన్యము = శ్రీకృష్ణుడు ధరించు శంఖమునకు పేరు; అభ్రంకష = మేఘము; పగిది = వలె; మ్రోయ = ధ్వనియీయగా; ఆహవభూమిన్ = యుద్ధభూమిని; విభ్రమలగు = తెల్లబోయిచూచుచు; దనుజసుతా = దైత్యసంతతియొక్క; గర్భంబులు = కడుపులు; పగులజేయు; ఘనుడవు = గొప్పవాడవు; కృష్ణా.

తా— కృష్ణా! యుద్ధభూమిలో నీ పాంచజన్య రవము చేతనే దనుజుల గర్భములు పగుల జేయుదువు.

క॥ జయమును విజయున కియ్యవె
హయముల ములుకోల మోపి • యదలించిమహా

రయమున నొప్పవె తేరును
భయమున రిపుసేనవిరిగి • పారగకృష్ణా. 27

అ—జయమున=గెలుపును; విజయునకు = అర్జునునకు; ఇయ్యవె= ఇచ్చినవాఁడవా; హా యనుల=సజ్జనుల; మురుకోల=కొరడా; మోపి = అనిచి; అదలించి=భయపెట్టి; మహారయమున=కడువేగమున; రొప్పవె= నడపవె; తేరును=రథమును; భయమున=భీతిచేత; రిపుసేన = పగవారిసైన్యము; విరిగి= చెదరి; పారగ=పరుగెత్తగ - కృష్ణా

తా—కృష్ణా! నీవు అర్జునునకు సారథివై- పగవారిసైన్యము పారిపోవునట్లు రథము నడిపినావు.

క॥ దుర్జనులగు నృపసంఘము
నిర్జింపగదలచినీవు • నిఖిలాధారా
దుర్జనులను వధియింపను
నర్జును రథచోదకుండ • వైతివికృష్ణా. 28

అ—దుర్జనులగు దుష్టులయిన; నృపసంఘము = రాజులను; నిర్జింపగ = గెలువగ; దలచి = భావించి; నీవు; నిఖిలాధారా= అందఱకును నాధారమైనవాఁడా; దుర్జనులను; వధియింపను = చంపగ; అర్జును = అర్జునునకు; రథచోదకుండవు = రథసారథివి; ఐతివి కృష్ణా.

తా—దుష్టులయిన రాజులను చంపుటకు నీవు అర్జునునకు రథసారథివైతివి.

క॥ శక్రసుతు గాచుకొరకై
చక్రము చేపట్టి భీష్ము • చంపగజనునీ
విక్రమమేమని పొగడుదు
నక్రగహాసర్వలోక • నాయక కృష్ణా. 29

అ—శక్రసుతు = ఇంద్రునిపుత్రుడైన అర్జునుని; కాచుకొరకై = రక్షించుటకు; చక్రము; చేపట్టు = చేతదాల్చి; భీష్ము = భీష్ముని; చంపగ = వధించుటకు; చను = వెళ్లు; నీ = నీయొక్క; విక్రమము = శౌర్యము; ఏమని; పొగడుదు = శ్లాఘింతును; నక్రగహా = మొసలినిచంపిన వాడా; సర్వలోకనాయక = సమస్తలోకములనకును నాధుడా; కృష్ణా

తా—కృష్ణా అర్జునుని రక్షించుట చక్రముబట్టి భీష్మునిజంపబోవు నీవిక్రమమేమని పొగడుదును!

క॥ దివిజేంద్ర సుతునిజంపియు
రవిసుతురక్షించినావు • రఘురాముఁడవై
దివిజేంద్ర సుతునిగాచియు
రవిసుతుబరిమార్చితౌర • రణమునకృష్ణా. 30

అ—దివిజేంద్ర = దేవేంద్రునియొక్క; సుతుని = కుమారుని; చంపియు = వధించియు; రవిసుతు = సూర్యనిపుత్రుని; రక్షించినావు = కాపాడినావు; రఘురాముడవై = రాముడవై; దివిజేంద్ర; సుతుని; కాచియు = రక్షించియు; రవిసుతు; పరిమార్చితి = చంపితివి; ఔర; రణమున = యుద్ధమున; కృష్ణా.

తా—కృష్ణా! నీవురాముడవై యింద్రపుత్రుడైన వాలింజంపి, సూర్యపుత్రుడైన సుగ్రీవునిరక్షించినావు; కృష్ణుడవై యింద్రపుత్రుఁడగు నర్జునుని రక్షించి, సూర్యపుత్రుడైన కర్ణునిజంపినావు.

క॥ దుర్భరబాణము రాగా
గర్భములోనుండి యభయ • కావుమటన్నన్
నిర్భరకృప రక్షించితి
వర్భకు నభిమన్యుసుతుని • నచ్యుత కృష్ణా. 31

అ—దుర్భర=భరింపఁజాలని; బాణము=శరము; గాఁగ; గర్భము లోనుండి=యుదరమునందుండి; యభయ=భయము బాపువాఁడా; కావుము= రక్షింపుము; అటన్నన్=అనగా; నిర్భర=గొప్ప; కృప=దయతో; రక్షించితివి=గాపాడితివి; అర్భకు=శిశువైన; అభిమన్యు = అభిమన్యునియొక్క; సుతుని=కొడుకును; అచ్యుత — కృష్ణా.

తా—కృష్ణా! అభిమన్యుని సుతుఁడు తల్లిగర్భమునందుండగా విరోధిచే ప్రయోగింపబడిన బాణముయొక్క వేడిమి కోర్వలేక రక్షింపుమని నిన్ను వేడగా, నీ వాతనిని దయతో బ్రోచితివి.

క॥ గిరులందు మేరువౌదువు
సురులందును నింద్రుఁడౌదు • చుక్కలలోనన్
బరమాత్మ చంద్రుఁడౌదువు
నరులందున నృపతివౌదు • నయముగ కృష్ణా. 32

అ—గిరులందున=కొండలలోన; మేరువౌదవు=మేరుపర్వతమౌదువు; సురలందున=దేవతలందు; ఇంద్రుఁడౌదు=ఇంద్రుడవౌదువు; చుక్కలలోన=నక్షత్రములందు; పరమాత్మ = భగవంతుఁడా; చంద్రుడౌదువు= చంద్రుడవౌదువు; నరులందున = మనుష్యులందు; నృపతివౌదు=రాజువౌదువు; నయముగ=బాగుగ; కృష్ణా—

తా—కృష్ణా! నీవు పర్వతములలో మేరువవు; దేవతలందు నింద్రుడవు; చుక్కలలో చంద్రుడవు; నరులలో రాజువు.

క॥ చుక్కల నెన్నగవచ్చును
గ్రక్కున భూరేణువులను • గణుతింపనగున్
జొక్కపు నీగుణజాలము
నక్కజమగు లెక్కపెట్ట • నజునకు కృష్ణా. 33

అ—చుక్కల = నక్షత్రములు; ఎన్నగ = లెక్కపెట్ట; వచ్చును —; గ్రక్కున = త్వరగా; భూరేణువులను = ఇసుక రేణువులను; గణుతింపనగు = లెక్కపెట్టవచ్చును; జొక్కపు = ఎక్కువైన; నీ = నీయొక్క; గుణజాలను = గుణసముదాయమును; నక్కజముగ = ఆశ్చర్యముగా; లెక్కపెట్ట; నజునకు = బ్రహ్మకు; కృష్ణా —

తా— చుక్కలనయిన, ఇసుక రేణువులనయిన లెక్కింపవచ్చును గాని, నీ గుణములు లెక్కించుటకు బ్రహ్మకైయిన తరము కాదు.

క॥ కుక్షిని నఖిలజగంబులు
నిక్షేపము జేసి ప్రళయ • నీరధి నడుమన్
రక్షక వటపత్రముపై
దక్షత పవళించునట్టి • ధన్యుఁడ కృష్ణా. 34

అ—కుక్షిని = కడుపులోన; అఖిలజగంబులు = లోకములనన్నిటిని; నిక్షేపము జేసి = దాచి; ప్రళయనీరధి = ప్రళయసముద్రము; నడుమన్ = మధ్యను; రక్షక = రక్షించువాడా; వటపత్రముపై = మఱ్ఱియాకుపైన; దక్షత = గొప్పగా; పవళించునట్టి = శయనించు; ధన్యుడవు = కృతార్థుఁడవు; కృష్ణా.

తా— కృష్ణా! నీవు ప్రళయసముద్రమునఁ గుక్షియం దన్నిలోకముల దాఁచి జలమధ్యమున మఱ్ఱియాకుపై శయనించిన ధన్యుఁడవు.

క॥ విశ్వోత్పత్తికి బ్రహ్మవు
విశ్వము రక్షింపఁ దలఁచి • విష్ణుఁడవనఁగా
విశ్వము జెరుపను హరుఁడవు
విశ్వాత్మక నీవె యగుచు • వెలయుదు కృష్ణా. 35

అ— విశ్వోత్పత్తికి (విశ్వ + ఉత్పత్తికి) = లోకముపుట్టుటకు; బ్రహ్మవు = విధాతవు; విశ్వము = లోకము; రక్షింప = కాపాడ; తలఁచి;

విష్ణుడవనగా=విష్ణుమూర్తివనగా; విశ్వము—చెరుపన=నడచుటకు; హరుడవు=రుద్రుడవు; విశ్వాత్మక=లోకములను కుక్షియందుంచుకొన్నవాడా; ఏవెయగుచు; వెలయుదు=ఒప్పుచున్నవు; కృష్ణా.

తా—కృష్ణా, విశ్వము పుట్టించుకొనుటకును, రక్షించుటకును, హరించుటకును, నీవే బ్రహ్మవు, విష్ణుడవు, రుద్రుడవై యుంటివి

క॥ అగణిత వైభవ కేశవ
నగధర వనమాలి యాది • నారాయణ, యో
భగవంతుడ శ్రీమంతుడ
జగదీశ్వర శరణు శరణు • శరణము కృష్ణా 36

అ—అగణిత=చెప్పతరముకాని; వైభవ=భాగ్యభోగ్యములు గలిగినవాడా; కేశవ = (విష్ణుమూర్తికి పేరు); నగధర = కొండ నెత్తినవాడా; వనమాలి=పుష్పహారము కంఠమందు ధరించువాడా; అదినారాయణ=లోకములకు మొదటి దేవుడవైనవాడా; ఓభగవంతుడా=ఓదేవుడా; శ్రీమంతుడ=భాగ్యవంతుడ; జగదీశ్వర=లోకనాయకా; శరణు ... ... కృష్ణా.

తా—ఓకేశవా! నగధరా! వనమాలీ! అదినారాయణా! ఓభగవంతా! ఓలోకనాయకా! కృష్ణా! నిన్ను శరణు బొందుచున్నాను.

క॥ మకరీమానమవై జలనిధి
పగతుని సోమకుని జంపి • పద్మభవునకు
న్నిగమములు దెచ్చి యిచ్చిన
సుగుణాకర మమ్ముఁగరుణ • జూడుము కృష్ణా. 37

అ—మకరమీనమవై = మకరచేపవై; జలనిధి = సముద్రములో; పగతుని = విరోధియైన; సోమకుని = సోమకుడను రాక్షసుని; చంపి = వధించి: పద్మభవునకున్ = బ్రహ్మకు (తామరపుష్పమునందు బుట్టినవాడు)

నిగమములు = వేదములు; తెచ్చి; ఇచ్చితి = ఇచ్చితివి; సుగుణాకర = మంచిగుణములుకలవాడా; మమ్ము = మమ్ములను; కరుణ = దయతో; చూడుము = వీక్షింపుము; కృష్ణా.

తా—మత్స్యమువై జలనిధిఁజొచ్చి సోమకునిజంపి వేదములు తెచ్చి బ్రహ్మకిచ్చిన యోకృష్ణా! మమ్ము దయజూడుము.

క॥ అందఱు సురలును దనుజులు
పొందుగ క్షీరాబ్ధిదరువ • పోలుపుననీవుఁ
అందముగ కూర్మరూపున
మందరగిరియెత్తితౌర మాధవకృష్ణా. 38

అ—అందఱు ;సురలును= దేవతలును; దనుజులు = రాక్షసులును; పొందుగ=ఒప్పుగా; క్షీరాబ్ధి = పాలసముద్రమున; తరువ = తరువగా; పోలుపున = బాగుగా; నీవుఁ = నీవు; అందముగ = సొంపుగ; కూర్మరూపున = తాబేలువేషమున; మందరగిరి = మందరపర్వతమును; ఎత్తితౌర = (ఎత్తితి + ఔర) ఎత్తినాడవు; మాధవ = లక్ష్మినాయక; కృష్ణా.

తా—ఓలక్ష్మినాయకా! కృష్ణా! దేవతలును, రాక్షసులును, పాల సముద్రమున మందరపర్వతము దరువగా నీవు తాబేలువై యాపర్వతమె త్తితివి.

క॥ ఆది వరాహమవయ్యును
నాదనుజు హిరణ్యనేత్రు • హతుజేసితగఁ
మోదమున సురలుపొగడగ
మేదినిగడి కోఱకుయెత్తి • మెరసితి కృష్ణా. 39

అ—ఆదివరాహమవయ్యును = (ఆది + వరాహమవు + అయ్యును) తొలి సూకరరూపున; ఆదనుజు=ఆ రాక్షసుడైన ; హిరణ్యనేత్రు=హిరణ్య

నేత్రుడను రాక్షసుని; కాతుజేసి=చంపి; తగఁగ=కొవ్వుగా; మోదమున= సంతోషముతో; సురలు=దేవతలు; పొగడఁగ=సన్నుతింప; కుంభిని=భూమిని; (కొమ్మకొనఁ)=దంష్ట్రిలచే; యెత్తి - మెరసితి=ప్రకాశించితివి; కృష్ణా —

తా— కృష్ణా! ఆదివరాహమూర్తివై హిరణ్యనేత్రుని జంపి భూమిని దంష్ట్రాగ్రభాగమున నిలిపితివి —

క॥ కెరలి యరచేత కంబము
నరుదుగ వేయుటను వెడలి • యసురేశ్వరునిన్
యురమును జీరి వధించితి
నరహరిరూపావతార • నగధర కృష్ణా 40

అ... కెరలి=కోపించి; అరచేత=అరచేతితో; కంబము=స్తంభము; నరుదుగ=వింత వింటనే; వేయుటను=కొట్టగా; వెడలి=బయలుదేరి; యసురేశ్వరునిన్=రాక్షసనాయకుని; ఉరమును=వక్షమును; జీర=చీల్చి; వధించితి=చంపితివి; నరహరిరూపావతార=మనుష్యరూపమును-మృగరూపమునుదాల్చి యవతారమెత్తినవాడా: నగధర=కొండను ధరించినవాడా: కృష్ణా —

తా— కృష్ణా! రాక్షసుడైన హిరణ్యకశిపుఁ డరచేతితో సభాస్తంభమును చలిచినంతనే నరమృగరూపమున దానినుండి వెడలి యారాక్షసుని జంపితివి.

క॥ వడుగవునై మూడడుగులు
నడిగితివో భళిర భళిర • యఖిలజగంబుల్
దొడిగితివి నీదుమేనున
గడుచిత్రము నీచరిత్ర • ఘనుడవు కృష్ణా. 41

అ— వడుగవునై=పొట్టిబ్రహ్మచారివై; మూడడుగులు=మూడడుగులు స్థలమును; అడిగితివో=అడిగినాడవు; భళిర=భళిర; అఖిలజగంబుల్=

అన్నిలోకములు; దాడగితివి=ఆక్రమించితివి; నీదు=నీయొక్క; మేనున=శరీరమున; గడు=మిక్కిలి; చిత్రము=ఆశ్చర్యము; నీ=నీయొక్క; చరిత=కథ; ఘనుడవు=గొప్పవాడవు; కృష్ణా.

తా—కృష్ణా! వామనుడవై బలిం జేరి మూడడుగుల భూమిదాన మడిగి లోకములన్నియు నాక్రమించిన నీచరిత్రము విచిత్రము.

క॥ ఇరువదొకమార్లు నృపతుల
శిరములు ఖండించితౌర • చేగొడ్డంటన్
ధరకశ్యపున కిచ్చియు
బరగగ జమదగ్ని రామ • భద్రుడ కృష్ణా. 42

అ—ఇరువదొకమార్లు=ఇరువదియొక్క సారులు; నృపతుల=రాజుల యొక్క; శిరములు=తలలు; ఖండించితౌర=కోసినాడవు; చేగొడ్డంటన్=చేతి గొడ్డలిచేత; ధర=భూమిని; కశ్యపునకు=కశ్యపుడనుమునికి; నిచ్చియు=ఇచ్చివేసియు; బరగగ=ఒప్పగ; జమదగ్ని; రామభద్రుడ=రాముడా; కృష్ణా.

తా—కృష్ణా! క్షత్రియులను నిరువదియొక్క మారులు గొడ్డలిచే జంపి భూమియెల్ల కశ్యపునకు దానమిచ్చిన పరశురాముడవు నీవే. రాముడవు నీవే.

క॥ దశకంఠుని బరిమార్చియు
కుశలముతో సీతదెచ్చి • కొనియు నయోధ్య
న్వశదముగ కీర్తిసేలిన
దశరధ రామావతార • ధన్యుడ కృష్ణా. 43

అ—దశకంఠుని=రావణుని; పరిమార్చియు=చంపి; కుశలముతో=సుఖముగా; సీత=సీతను; తెచ్చికొని—; అయోధ్యన్=అయోధ్యాపుర

మును; వెలదమూగ=ప్రకాశమానముగ; కీర్తి=కీర్తితో; ఏలిన=పరిపాలించిన; దశరథ రామావతార=దశరథుని పుత్రుడైన రామా; ధన్యుడ=కృతార్థుడవు, కృష్ణా

తా—కృష్ణా! నీవు రావణుని జంపి సీతను దెచ్చుకొని అయోధ్యను కీర్తితో నేలిన రామమూర్తివి.

క॥ ఘనులగు ధేనుకముష్టిక
దనుజుల చెండాడితౌర • తగభుజశక్తిన్
అనఘాత్మ రేవతీపతి
యనగా బలరామమూర్తి • యౌగదకృష్ణా 44

అ—ఘనులగు=గొప్పవారైన; ధేనుకముష్టిక=ధేనుకముష్టికులను; దనుజుల=రాక్షసుల; చెండాడితౌర = చంపినాడవు; తగ = యొప్పిన; భుజశక్తిన్=భుజబలముచేత; అనఘాత్మ=మంచిమనస్సుగలవాడా; రేవతీపతి = రేవతినాధుడవు; అనగా—; బలరామమూర్తిన్=బలరాముడవు; యౌగద=అగుదువుకదా.

తా—కృష్ణా! నీవు ధేనకముష్టికులను భుజబలముచే జంపితివి. నీవే రేవతీపతియైన బలరాముడవు.

క॥ త్రిపురాసుర భార్యలనతి
నిపుణలతో వ్రతముచేత • నిలిపినకీర్తిన్
కపటపురాజవు ఛీ రే
కృపగల బౌద్ధావతార • శ్రీపతికృష్ణా 45

అ—త్రిపురాసుర భార్యల=మూడుపురములలోనుండు రాక్షసుల భార్యలను; అతినిపుణతతో=అతిసమర్థతతో; వ్రతముచేత నిలిపిన; కీర్తిన్;

కపటపు - మాయ; రాజవు; ధళిరే; కృపగల=దయగల; బౌద్ధావతార=బుద్ధమూర్తివి.

తా—కృష్ణా! నీవు బుద్ధుడవై త్రిపురాసురుల భార్యలను వ్రతముచేత నిలిపితివి.

క॥ వలపుల తేజీనెక్కియు
యిలపై ధర్మంబునిలుప • హీనుల ద్రుంపన్
కలియుగము తుదిని వేడుక
కలికివిగానున్న లోక • కర్తవు కృష్ణా 46

అ—వలపుల=ముద్దుల; తేజీ = గుఱ్ఱము; నెక్కియు—; యిలపై= భూమిలో; ధర్మంబు=ధర్మమును; నిలుప=స్థాపింప; హీనుల = దుష్టుల; ద్రుంపన్=చంపగా; కలియుగము తుదిని=కలియుగమున; వేడుక=సంతోషముతో; కలికివిగానున్న=కలికివైయున్న; లోకకర్తవు= లోకములకు ప్రభుడవు.

తా—కృష్ణా! నీవు కలియుగమున ధర్మములు నిలుప కలికిమూర్తివైన లోకకర్తవు.

క॥ వనజాక్ష భక్తవత్సల
మునులగు మూర్తిత్రయంబు • కరుణానిధివై
వినునీ సద్గుణజాలము
సనకాది మునీంద్రులెన్న • జాలరు కృష్ణా 47

అ—వనజాక్ష=పద్మములవంటి నేత్రములుగలవాడా; భక్తవత్సల= భక్తులయందు ప్రేమయుంచువాడా; మునులగు=మునులైన; మూర్తిత్రయంబు=మూడుమూర్తులు; కరుణానిధివై=కృపగలిగినవాడవై; విను; నీ=నీయొక్క; సద్గుణజాలము=గుణసముదాయము; సనకాదిమునీంద్రులు=సనకుడు మొదలయినమునులు; ఎన్న=లెక్కపెట్ట; చాలరు=శక్తులుగారు.

తా—కృష్ణా; నీసద్గుణములు మూడుమూర్తులున; సనకాదిమునీంద్రు లుగూడ లెక్కింపజాలరు,

క॥ అపరాధ సహస్రంబుల
నపరిమితములైన యఘము • లనిశము నేనుం
గపటాత్ముడనై జేసితి
చపలుని ననుగావు శేష • శాయివి కృష్ణా 57

అ—అపరాధసహస్రంబులు=వేలకు వేలుదోసములు; అపరిమితము లైన=మితములేని, యఘములు=పాపములు; అనిశము= రాత్రింబవళ్లు నేను; నేను;కపటాత్ముడనై=దుష్టబుద్ధి గలిగినవాడనై;చేసితి; చపలుని=చపలుడ నైన; నను=నన్ను; కావు=రక్షింపుము; శేషశాయివి=నాగశయనుడవు.

తా—శేషశాయివైన యోకృష్ణా! నేనహర్నిశలు లెక్కలేని దోషములు పాపములు చేసిన చపలచిత్తుడను; నన్ను రక్షింపుము.

క॥ నరపశువు మూఢచిత్తుడ
దురితారంభుడను మిగుల • దోషాత్ముడ నే
గురు తెరుగ నెంతవాడను
హరి నీవే ప్రాపు దాపు నాదువు • కృష్ణా 58

అ—నరపశువు=మనుష్యులలో పుట్టినపశువును; మూఢచిత్తుడ=మూఢ చిత్తుడను; దురితారంభుడ=పాపములు సేయువాడను; మిగుల=ఎక్కువగా; దోషాత్ముడ=దోషములచేనిండియున్న మనస్సుగలవాడను; నే=నేను; గురు తెరుగ=మంచి తెలియు; ఎంతవాడను=ఎంతటివాడను; అనగా తెలియనివాడ నని భావము. హరి; నీవే; ప్రాపుదాపు=తోడునీడ—ఔదువు;

తా—కృష్ణా; నేనునరపశువును. మూర్ఖుడను; దోషాత్ముడను; హితము తెలియనివాడను; నాకునీవుతోడు=నీడ;

క॥ పరనారీ ముఖపద్మము
గురుతుగ కుచ కుంభములను • గొప్పను నడుము౯
నరయుఁగనె మోహింతురు
నిరతము నిను భక్తిఁ గొల్వ • నేరరు కృష్ణా. 50

అ—పరనారీముఖ పద్మము=పరస్త్రీలయొక్క ముఖమనే పద్మము; గురుతుగ=నూటిగ; కుచకుంభములను=గొప్పను, నడుమును; ఆరయుఁగనె=చూచినంతనే; మోహింతురు=భ్రాంతిజెందుదురు; నిరతము-ఎప్పుడును; నిను; భక్తి=భక్తితో; గొల్వ=పూజింప; నేరరు=చాలరు.

తా—కృష్ణా! పరనారులను జూచినంతనే మోహింతురు గాని మను•ష్యులు నిన్ను భక్తితోభజింపజాలరు.

క॥ పంచేంద్రియ మార్గంబుల
గొంచెపు బుద్ధిని చరించి • కొన్ని దినంబుల్
ఇంచుక సజ్జనసంగతి
యంచును మిమ్మెఱిఁగినాడ • నిప్పుడె కృష్ణా 51

అ—పంచేంద్రియ మార్గంబుల=పంచేంద్రియముల మార్గములందును; కొంచెపుబుద్ధిని=అల్పబుద్ధిని; చరించి-తిరిగి; కొన్ని దినంబుల్=కొన్నాళ్ళు; ఇంచుక=కొంచెము; సజ్జన సంగతి=మంచివారి సహవాసము; అంచును=అని; మిమ్ము=మిమ్ముల; ఎఱిగినాడ-కనుగొంటిని.

తా—పంచేంద్రియముల మార్గముల ననుసరించి కొన్నాళ్ళు స్వల్ప బుద్ధితో జరించితిని. ఇప్పుడు మంచివారి స్నేహముచేత ఓ కృష్ణా! నిన్ను కనుగొంటిని.

క॥ దుష్టుండ దురాచారుఁడ
దుష్ట చరిత్రుఁడను చాల • దుర్బుద్ధిని నే

స్రష్ట నినుఁగొల్వ నేరను
కష్టుని ననుఁగావుకావు ♦ కరుణను కృష్ణా 52

అ—దుష్టుఁడ=దుష్టుడను; దురాచారుఁడ=ఆచారము లేనివాడను; దుష్టచరిత్రుడ=దుష్కార్యములతో నిండిన చరిత్రగలవాడను; చాల=ఎక్కువగా; దుర్బుద్ధిని=చెడ్డమనస్సు గలవాడను; నేను=నేను; స్రష్ట=జగముల నిర్మించువాడా; నిను=నిన్ను; గొల్వనేరను=కొలుచుట యెఱుగను; కష్టుని=కష్టుడనైన; నను = నన్ను; కావు = కావు; రక్షింపుము=రక్షింపుము; కరుణను=కృపతో

తా—కృష్ణా! నేను దుష్టుడను, ఆచారము లేనివాడను, చెడ్డమనస్సు గలవాడను, నిన్ను గొలుచుట యెఱుగను, నన్ను రక్షింపుము

క॥ కుంభీంద్ర వరద కేశవ
జంభాసుర వైరి దివిజ ♦ సన్నుత చరితా
యంభోజ నేత్ర జలనిధి
గంభీరా నన్నుగావు ♦ కరుణను కృష్ణా 53

అ—కుంభీంద్రవరద=ఏనుగను రక్షించినవాడా; కేశవ, జంభాసుర=జంభాసురుడను వానికి; వైరి=విరోధి; దివిజ=దేవతలచేత; సన్నుతచరితా=పొగడబడు చరిత్రముకలవాడా; అంభోజనేత్ర=తామర రేకులవంటి కన్నుల గలవాడా; జలనిధి = సముద్రమువంటి; గంభీర = గంభీరతగలిగినవాడా; నన్ను; గావు=రక్షింపుము; కరుణను=దయతో.

తా—ఏనుగను రక్షించిన యో కేశవా! ఇంద్రుడు మొదలగు దేవతలచే సన్నుతింపబడు వాడా; తామర రేకులవంటి కన్నులుగలవాడా! నన్ను రక్షింపుము.

క॥ దిక్కెవ్వరు ప్రహ్లాదుని
దిక్కెవ్వరు పాండుసుతుల • దీనులకెపుడున్
దిక్కెవ్వరయ్యహల్యకు
దిక్కెవ్వరు నీవెనాదు దిక్కవు కృష్ణా 54

అ—దిక్కెవ్వరు (దిక్కు + ఎవ్వరు) ప్రహ్లాదుని........పాండు సుతుల = పాండవుల (ధర్మ భీమార్జున నకుల సహదేవులు); దీనులకు = దిక్కు లేనివారికి; ఎపుడున్ = ఎప్పుడును; దిక్కెవ్వరు, అయ్యహల్యకు = అహల్యయను మునిపత్నికి; దిక్కెవ్వరు, నీవె, నాదు = నాయొక్క, దిక్కవు.

తా—కృష్ణా! ప్రహ్లాదునకును, పాండవులకును, అహల్యకును, దిక్కు లేనివారికిని, నెవ్వరు దిక్కో అట్టినీవే నాకు దిక్కగుము.

క॥ హరినీవె దిక్కునాకును
సిరితో నేతెంచిమకరి • శిక్షించిదయం
బరమేష్ఠి సురలుబొగడగ
కరిగాచిన రీతినన్ను గావుముకృష్ణా 55

అ—హరి = ఓహరీ; నీవె, దిక్కు, నాకును; సిరితో = లక్ష్మీదేవితో; ఏతెంచి = వచ్చి; మకరి = మొసలిని; శిక్షించి = దండించి; దయం = కృపతో; పరమేష్ఠి = బ్రహ్మ; సురలు = దేవతలు; బొగడగ = సన్నుతింపగ; కరిన్ = ఏనుగను; కాచిన = రక్షించిన; రీతి = మాడ్కి; నన్ను, గావుము = రక్షింపుము.

తా—లక్ష్మీదేవితో వచ్చి మొసలిని శిక్షించి గజమును గాచినట్లు నన్ను రక్షింపుము.

క॥ పురుషోత్తమ లక్ష్మీపతి
సరసిజ గర్భాది మౌని • సన్నుతచరితా

మురభంజన సురరంజన
వరదుఁడవగు నాకుభక్త • వత్సలకృష్ణా 56

అ—పురుషో త్తమ=(పురుష + ఉత్తమ) పురుషులలో, ఉత్తము డైనవాడా; లక్ష్మీపతి=లక్ష్మీదేవికిమగడా; సరసిజగర్భాది=బ్రహ్మ మొదలయిన; మౌనిసన్నుత=మునులచే పొగడబడు; చరిత=చరిత్రముగలవాడా; ముర=మురుడను దానవుని; భంజన=తెగటార్చినవాడా; సురరంజన=దేవతలకు సంతోషము గలుగజేయువాడా; వరదుడవు=రక్షకుడవు; అగు=అగుము; నాకు, భక్తవత్సల=భక్తులయందు ప్రేమయుంచువాడా.

తా— ఓ పురుషోత్తమా! ఓ లక్ష్మీపతీ! బ్రహ్మ మొదలయిన వారిచే సన్నుతింపబడువాడా! మురదానవుని జంపినవాడా! సురులకు సంతోషము గూర్చువాడా! నాకు రక్షకుడవగుము.

క॥ క్రతువులు తీర్థాగమములు
వ్రతములు దానములు • సేయవలెనా లక్ష్మీ
పతిమిము దలచినవారికి
నతులిత పుణ్యములు గలుగు టరుదాకృష్ణా 57

అ—క్రతువులు=యాగములు; తీర్థాగమములు=తీర్థసేవలు; వ్రతములు; దానములు, సేయవలెనా, లక్ష్మీపతీ, మిము, తలచిన, వారికి; అతులిత=గొప్ప; పుణ్యములు, గలుగుట; అరుదా=కొఱతా.

తా—కృష్ణా, యాగములు, తీర్థసేవలు, వ్రతదానములు చేయుట యెందుకు? నిన్ను దలచినచో పుణ్యములు గలుగవా?

క॥ స్తంభమున వెడలిదానవ
డింభకు రక్షించినట్టి • రీతిని వెలయన్

అంభోజనేత్ర జలనిధి
గంభీరుఁడ నన్నుఁగావు • కరుణను కృష్ణా 58

అ— స్తంభమున= స్తంభమునుండి; వెడలి=బయలుదేరి; దానవడింభకు= రాక్షసబాలుని (ప్రహ్లాదుని); రక్షించినట్టి=కాపాడినట్టి; రీతిని, వెలయఁగ; అంభోజనేత్ర=పద్మములవంటి కన్నులుగలవాఁడా; జలనిధి=సముద్రముతో సమమైన; గంభీరుఁడ = గాంభీర్యముగలవాఁడా; నన్ను, కావు, కరుణను= దయతో.

తా— కృష్ణా! స్తంభమునుండి వెడలి ప్రహ్లాదుని రక్షించినట్లు నన్ను రక్షింపుము.

క॥ శతకోటి భానుతేజుఁడ
యతులిత సద్గుణ గణాఢ్య • యంబుజనాభా
రతినాథ జనకలక్ష్మీ
పతిహిత ననుగావు • భక్త • వత్సల కృష్ణా 59

అ— శతకోటి భానుతేజుఁడ=నూరుకోట్ల సూర్యుల తేజముగలవాఁడా; అతులిత గొప్ప; సద్గుణగణాఢ్య=మంచిగుణములచే నొప్పువాఁడా; అంబుజనాభ=బొడ్డునందు పద్మముగలవాఁడా; రతినాథజనక=మన్మథునకు తండ్రియైనవాఁడా (రతీదేవి భర్తపేరు మన్మథుడు; మన్మథుని తండ్రి విష్ణుమూర్తి); లక్ష్మీపతి, హిత, నను, గావు; భక్తవత్సల భక్తులను ప్రేమతో జూచువాఁడా.

తా— శతకోటి భానుతేజుఁడవును, మంచిగుణములు గలవాఁడవును, అంబుజనాభుఁడవును, మన్మథజనకుఁడవును, లక్ష్మీరమణుఁడవును, నగు నో కృష్ణా! భక్తవత్సలా! నన్ను రక్షింపుము.

క॥ మందుడనే దురితాత్ముడ
నిందల కొడిగట్టినట్టి • నీచునినన్నున్
సందేహింపక కావుము
నందుని వరపుత్ర నిన్ను • నమ్మితికృష్ణా 60

అ— మందుడ=మూర్ఖుడ; నే=నేను; దురితాత్ముడ= దోషములతో గూడిన మనస్సుగలవాడను; నిందలకు=అపవాదలకు; ఒడిగట్టినట్టి = చెంగుబట్టిన; నీచుని=అల్పబుద్ధిగలవానిని; నన్నున్; సందేహింపక=సంశయింపక; కావుము = రక్షింపుము; నందుని=నందునియొక్క; వరపుత్ర=కుమారుడా; నిన్ను; నమ్మితి.

తా—కృష్ణా! నేనుమూర్ఖుడ, అనేకనిందలుబొందిననీచుడ, నన్ను సంశయింపకరక్షింపుము.

క॥ గజరాజ వరద కేశవ
త్రిజగత్క ల్యాణమూర్తి • దేవమురారీ
భుజగేంద్రశయన మాధవ
విజయాప్తుడనన్ను గావు • వేడుకకృష్ణా. 61

అ—గజరాజవరద=ఏనుగనురక్షించినవాడా; కేశవ; త్రిజగత్కల్యాణమూర్తి = మూడులోకముల కునుగల్యాణముగూర్చువాడా; దేవ; మురారీ=మురుడనురాక్షసునకువైరీ; భుజగేంద్రశయన=సర్పరాజుపై పవ్వళించువాడా; మాధవ=లక్ష్మీనాయక; విజయాప్తుడ; (విజయ + ఆప్తుడ) అర్జునునకు స్నేహితుడా; నన్ను; గావు; వేడుక=సంతోషముతో.

తా—ఓకృష్ణా! కరినిరక్షించినవాడా; కేశవా! మూడు లోకముల కును గల్యాణముగూర్చువాడా! భుజగతల్పకా! అర్జునుని స్నేహితుడా! నన్ను సంతోషముతో రక్షింపుము.

క॥ గోపాల దొంగముగహార
పాపాలను పారదోలు • ప్రభుడవునీవే
గోపాలమూ ర్తి దయాళో
నాపాలిటగలిగ్రోవు • నమ్మితికృష్ణా.                    62

తా—ఓకృష్ణా; గోపాలా! నీవే పాపములను బోగొట్టుప్రభుడవు. నిన్ను నమ్మితి గావున నాపాలిటనుండి రక్షింపుము.

క॥ దుర్మతి నేబలుకష్టపు
కర్మంబులు జేసినట్టికష్టుడనన్నున్
నిర్మలుని జేయవలెనుదు
ష్కర్ముడ నినునమ్మినాడ సతతముకృష్ణా                    63

అ—దుర్మతిన్ = చెడ్డబుద్ధికలవాడను; నే=నేను; పలుకష్టపు = ఎక్కువకష్టమైన; కర్మంబులు=పనులు; చేసినట్టి; కష్టుడ; నన్నున్; నిర్మలుని= మంచిమనస్సుకలవానిగ; చేయవలెను = కావింపవలెను; దుష్కర్ముడ= చెడ్డపనులుచేయువాడను; నిను; నమ్మినాడ; సతతము=ఎప్పుడు.

తా—కృష్ణా! నేనుదుర్మతిని, కష్టుడను, దుష్కర్ముడను; నిన్ను నమ్మినానుకావున నన్ను నిర్మలునిజేయుము.

క॥ దుర్వారచక్రధరశర
శర్వాణీప్రణుతవినుత జగదాధారా
నిర్వాణనాధ మాధవ
సర్వాత్మకనన్నుగావు సరసుడకృష్ణా.                    64

అ—దుర్వార= గొప్పదైన; చక్ర = చక్రమును; ధర = ధరించినవాడా; శర=బాణమునవాల్చువాడా; శర్వాణి=పార్వతిచేత; ప్రణుత = నమస్కరింపబడువాడా; వినుత=పొగడబడువాడా; జగదాధారా=లోక

మునకు ఆధారమైనవాడా; నిర్వాణనాథ = మోక్షమునకుకర్త; మాధవ = సర్వాత్మక = అందరిమనస్సులనుండువాడా; నన్ను; గావు; సరసుడ.

తా—ఓ చక్రధరా! పార్వతిచేవినుతింపబడువాడా! ఓ మోక్షకర్తా! మాధవా! సర్వాత్మక! నన్నురక్షింపుము.

క॥ సుత్రామనుత జనార్దన
సత్రాజిత్తనయనాథ • సౌందర్యదశా
చిత్రావతార దేవకి
పుత్రాననుగావుసీకు పుణ్యముకృష్ణా 65

అ—సుత్రామనుత = ఇంద్రునిచే బొగడబడువాడా; జనార్దన (విష్ణుమూర్తిపేరు); సత్రాజిత్తనయనాథ = సత్రాజిత్తునకు గూతురైన సత్యభామకు మగడా; సౌందర్యదశా = చక్కనివాడా; చిత్రావతార = అద్భుతమైన అవతారములనెత్తువాడా; దేవకిపుత్ర — దేవకికి కొడుకైనవాడా; నను, గావు, నీకు, పుణ్యము,

తా—ఓ కృష్ణా! దేవకీపుత్రా! సత్యభామాధవా! సుత్రామసన్నుతా! ఓజనార్దనా నన్ను రక్షింపుము నీకు పుణ్యముండును.

క॥ బలమెవ్వడు కరిబ్రోవను
బలమెవ్వడు పాండుసుతుల • భార్యనుగావం
బలమెవ్వడు రవిసుతునకు
బలమెవ్వడు నీవునాకు బలమాకృష్ణా, 66

అ—బలము = ఎవ్వడు; కరి = ఏనుగను; బ్రోవను = రక్షింప; బలమెవ్వడు = పాండుసుతుల; భార్యను = భార్యయైన ద్రౌపదిని; గావం = రక్షింప; బలమెవ్వడు—రవిసుతునకు = సూర్యపుత్రుడైన సుగ్రీవునకు; బలమెవ్వడు...

తా—కరికిని, ద్రౌపదికిని; సుగ్రీవునకును, నెవ్వడు బలమైయుండె నో, అట్టినీవే నాదుబలమై యుండుము.

క॥ పరుసముసోకిన యినుమును
వరుసగ బంగారమైన వడువునజింహ్వాగ్రా
హారినీనామము సోకిన
సురవందితయేను నగుదు • సులభుడకృష్ణా. 67

అ—పరుసము = పరుసవేది; సోకిన=తగిలిన; ఇనుమును—వరుసగ= క్రమముగ; బంగారము—ఐన—వడువున=రీతి; జింహ్వాగ్ర=మనస్సున; హరి-నీ=నీయొక్క; నామము=పేరు; సోకిన—సురవందిత=దేవతలచే నుతింపబడువాడా; ఏనును=నేనును; అగు—సులభుడ=మంచివాడను.

తా—కృష్ణా! పరుసము సోకినంతనే ఇనుము బంగారమైనట్లు నీనామము నాజింహ్వను దగిలినచో నేనును మంచివాడనగుదును.

క॥ ఒకసారినీదు నామము
ప్రకటముగాదలచువారి పాపములెల్లన్
వికలములై దొలగుటకును
సకలార్థయజామిళుండు సాక్షియెకృష్ణా. 68

అ—ఒకసారి=ఒక్కమారు నీదు=నీయొక్క; నామము=పేరు; ప్రకటముగా=గొప్పగా; తలచువారి=స్మరించువారి; పాపములెల్లన్=అన్ని పాపములు; వికలములై=చెదరి; తొలగుటకును=పోవుటకును; సకలార్థ= సర్వము తెలిసినవాడా; అజామిళుండు=అజామిళుడనువాడు; సాక్షియె.

తా—కృష్ణా! నీనామ మొక్కమారు స్మరించినచో పాపములన్నియు పోవునని చెప్పుటకు అజామిళుడే సాక్షి.

క॥ హరిసర్వంబున గలడని
గరిమను దైత్యుండు బలుకఁ గంబములోనన్
యిరవొందవెడలి చీలవె
శరణన్న విభీషణుండు సాక్షియెకృష్ణా. 69

అ—హరి—సర్వంబున=అన్నిచోట్ల; కలడని=ఉన్నాడని; గరిమను-దైత్యుండు=రాక్షసుడు; పలుక=అనగా; కంభములోనన్ = స్తంభములో; యిరవొంద=ఒప్పగా; వెడలి=బయలుదేరి; చీలవె = చంపవె; శరణన్న= శరణుబొందిన; విభీషణుడు (రావణాసురుని తమ్ముడు); సాక్షియె.

తా—కృష్ణా! హరి సర్వప్రదేశముల నున్నాడని పలికినంతనే స్తంభమునుండి వెడలి రాక్షసునిజంపితివి. శరణన్నవారిని బ్రోతువనుటకు విభీషణుడే సాక్షి.

క॥ భద్రార్చిత పదపద్మను
భద్రాగ్రజసర్వలోక పాలనగుణశ్రీ
రుద్రాది దేవసన్నుత
భద్రాధిపనన్ను బ్రోవుభయహరకృష్ణా 70

అ—భద్రార్చిత=మంచివారిచే బూజింపబడు; పదపద్మ=పద్మముల వంటి పాదములుగలవాడా; సుభద్రాగ్రజ- సుభద్రకు నన్నయైనవాడా; సర్వలోకపాలనగుణ=అన్ని లోకములను పాలించు గుణముకలవాడా; శ్రీరుద్రాది= రుద్రుడు మొదలయిన! దేవసన్నుత=దేవతలచే బొగడబడువాడా; భద్రాధిప=సౌఖ్యముల నిచ్చువాడా; నన్ను బ్రోవు; భయహర=భయమును బాపువాడ;

తా—ఓ కృష్ణా! సుభద్రాగ్రజా! రుద్రాది దేవసన్నుతా! భయహరా! నన్ను రక్షింపుము.

క॥ ఎటువలెకరి మొరవింటివి
ఎటుబ్రహ్లాదునకు నభయమిచ్చితి కరుణ
న్నటువలెనను రక్షింపుము
కటకట నినునమ్మినాడ ♦ గావుముకృష్ణా　　71

అ—ఎటువలె=ఎట్లు; కరి = ఏనుగయొక్క; మొర = ప్రార్థన; వింటివి=విన్నాడవు; ఎటు; ప్రహ్లాదునకు; అభయమిచ్చితి=శరణమిచ్చితివి; కరుణన్=కృపతో; అటువలె=అట్లే; నను; రక్షింపుము = కాపాడుము; కటకట; నినునమ్మినాడ గావుము;

తా—ఎట్లు కరినేలితివో, ఎట్లు ప్రహ్లాదుని బ్రోచితివో యట్లేనిన్ను నమ్మిన నన్ను రక్షింపుము.

క॥ తటతట లేటికి జేసెదు
కటకట పరమాత్మనీవు ఘంటాకర్ణున్
ఎటువలెనిపుణుని జేసితి
వటువలె రక్షింపుమయ్య యచ్యుతకృష్ణా　　72

తా—కృష్ణా! ఆలస్యమేల చేసెదవు. ఘంటాకర్ణునెట్లు బ్రోచితివో యట్లే నన్ను రక్షింపుము.

క॥ తురగాధ్వ రంబుజేసిన
పురుషులకును వేరెపదవి పుట్టుటయేమో
హరిమిము దలచినవారికి
యరుదా కైవల్యపదవి ♦ యచ్యుతకృష్ణా　　73

అ—తురగాధ్వరంబు=అశ్వమేధయాగము; చేసిన; పురుషులకును; వేరె=ఇతర; పదవి=స్థానము; పుట్టుట=కలుగుట; యేమో; హరి, మిము, దలచిన వారికి=కొలిచిన జనులకు; యరుదా = కొఱతయుండునా; కైవల్య పదవి=మోక్షము, అచ్యుత,

తా—కృష్ణా! అశ్వమేధ యాగముజేసినవారికేమి పదవిదొరుకునో గాని, నిన్ను గొలిచినవారికి మోక్షము దొఱకకయుండదు.

క॥ ఓభానుతేజ! కేశవ
యోభరతాగ్రజమురారి • యోరఘురామా
యోభక్తకామధేనువ
యోభవహరనన్నుగావు • మోకకృష్ణా. 74

అ—ఓభానుతేజ=ఓ, సూర్యునితేజముగలవాడా; కేశవ, యోభరతాగ్రజ = భరతునకు నన్నయైనవాడా; మురారి = మురుడనుదానవునకు విరోధీ; యోరఘురామా= ఓరామచంద్రా; యోభక్తకామధేనువ=భక్తుల పాలిటికామధేనువా; యోభవహర = పాపముల హరించువాడా; నన్ను, గావుము, ఓపిక,

తా—ఒ భానుతేజా! కేశవా! ఓభరతాగ్రజా! ఓమురారీ! ఓరామా! ఓభక్తులపాలిటి కామధేనువా! పాపముల బాపువాడా! నన్ను రక్షింపుము.

క॥ ఓతండ్రికనక కశ్యపు
భూతలమునఁజంపినావు • పుత్రునిగావన్
బ్రీతిసురకోటి బొగడఁగ
నాతండ్రీనిన్ను నేను నమ్మితికృష్ణా. 75

అ—ఓ తండ్రి; కనకకశ్యపు=హిరణ్యకశిపుడను రాక్షసుని; భూతలమున = భూమియందు; చంపినావు; పుత్రునిగావన్ = వాని కొడుకును రక్షించుటకు; ప్రీతి=ప్రీతితో; సురకోటి=దేవతలెల్ల; బొగడగ=శ్లాఘింపఁ నాతండ్రీ, నిన్ను నేను నమ్మితి.

తా—ప్రహ్లాదుని రక్షించుటకు వానితండ్రియగు హిరణ్యకశిపుని జంపినావు తండ్రీ! నిన్ను నేను నమ్మితిని.

క॥ ఓపుండరీకలోచన
యోపురుషోత్తమముకుంద యోగోవిందా
యోపురసంహార మిత్రుడ
యోపుణ్యుడనన్నుబ్రోవు మోహరికృష్ణా. 76

అ—ఓ పుండరీకలోచన = తామరరేకులవంటి కన్నులుగలవాడా; ఓ పురుషోత్తమ = పురుషులలో నుత్తముడైనవాడా; ముకుందా - యోగోవిందా (విష్ణుమూర్తికి నామములు); యోపురసంహార మిత్రుడ = త్రిపురములు హరించిన యీశ్వరునకు స్నేహితుడా; యోపుణ్యుడ; నన్ను = బ్రోవుము - ఓ హరి,

తా—(సులభము.)

క॥ ఏవిభుడుఘోర రణమున
రావణువధియించి లంకరాజుగ నిలిపెన్
దీవించియా విభీషణు
నావిభునే దలతునేను నచ్యుతకృష్ణా 77

అ—ఏ విభుడు = ఏ ప్రభుడు; ఘోరరణమున = గొప్పయుద్ధమున; రావణు = రావణాసురుని; వధియించి = చంపి; లంక = లంకకు; రాజుగ = పాలకునిగ; నిలిపెన్ = నిలిపినాడో; దీవించి = ఆశీర్వదించి; ఆవిభీషణు = రావణుని తమ్ముడైన యావిభీషణుని; ఆవిభునే = ఆప్రభువునే; తలతు = స్మరింతు; నేను - అచ్యుత - (విష్ణుమూర్తి పేరు).

తా—కృష్ణా! యుద్ధములో రావణుని జంపి వాని తమ్ముడైన విభీషణుని లంకకు రాజుగ నేప్రభుచేసెనో యతనినే నేను తలతును

క॥ గ్రహబాధయు దోషము బొందదు
బహుపీడలుచేర వెఱచుపాయును నఘముల్

ఇహపర ఫలదాయకవిను
తహతహ లెక్కడివి నిన్నుఁ దలచినకృష్ణా 78

అ—గ్రహభయదోషము-పీడా-చయములవలన భయము; పొందదు= చేరదు; బహుపీడలా=ఇతర రోగములు; చేరవెఱచు=సమీపించుటకు భయ పడుదును; పాయును=పోవును; ఘములు=పాపములు; ఇహపరఫలదా యక=ఇహలోకమునను, పరలోకమునను గూడా ఫలమునిచ్చువాఁడా; నిను-తహతహలు=తొందరలు; ఎక్కడివి-ఎక్కడనుండును- నిన్ను, దలచిన,

తా—కృష్ణా! నిన్ను తలంచినవారిని గ్రహదోషముగాని, పీడలు గాని, పాపములుగాని చేరవు.

క॥ గంగ మొదలైన నదులను
మంగళముగ జేయునట్టి • మజ్జనములకుఁ
సంగతిగలిగిన ఫలములు
రంగుగ మిముదలచు పాటి రావురకృష్ణా 79

అ—గంగ, మొదలయిన నదులను=గంగానది మొదలయిన, పుణ్య మైన నదులలో; మంగళముగ=శుభముగ; చేయునట్టి=కావించునట్టి; మజ్జన ములకుఁ=స్నానములకు; సంగతి_కలిగిన=యొదవిన; ఫలములు; రంగుగ= బాగుగ; మిము_తలచు పాటి=మిమ్ము తలచినదానితో సమానముగ-రావుర,

తా—కృష్ణా గంగ మొదలైన నదులలో స్నానము జేసినందువలన గలుగు పుణ్యములు, నిన్ను గొలిచినందువలన వచ్చుపుణ్యములతో సమము-గావు.

క॥ ఆదండకావనంబున
కోదండముదాల్చినట్టి కోమలమూర్తి
నాదండనింక నిలువుము
వేదండముకాచినట్టి వేల్పువుకృష్ణా. 80

టీ—ఆదండకావనమున = ఆదండకారణ్యములో; కోదండము = బాణము; దాల్చినట్టి = ధరించినట్టి; కోమలమూర్తి = అందమైనవాడా; నాదండ = నాయండ; ఇంక; నిలువుము; కేవండము = ఏనుగను; కాచినట్టి = రక్షించినట్టి; వేల్పవు = దేవుడవు;

తా—దండకారణ్యమున జరించినవాడా! కరి నేలినవాడా! నాదండ నిలువుము,

క॥ చూపుము నీరూపంబును
పాపపు దుష్కృతములెల్ల పంకజనాభా
పాపము నాకును దయతో
శ్రీపతి నిను నమ్మినాడ సిద్ధము కృష్ణా. 81

టీ...చూపుము = కనబడజేయుము; నీరూపమును; పాపపు; దుష్కృతములు = చెడ్డపనులు; ఎల్ల = అన్ని; పంకజనాభా = బొడ్డునందు పద్మముగలవాడా; పాపుము = బాయజేయుము; నాకును; దయతో = కృపతో; శ్రీపతి = లక్ష్మీపతి; నినునమ్మినాడ; సిద్ధము = నిజము.

తా—కృష్ణా! నేను నిన్ను నమ్మినాను. నీరూపమును జూపి నాపాపములను బాపుము.

క॥ నీనామము భవహరణము
నీనామము సర్వసౌఖ్య నివహకరంబున్
నీనామ మమృతపూరము
నీనామము నేదలంతు నిత్యముకృష్ణా. 82

టీ—నీనామము = నీపేరు; భవహరణము = పాపములు హరించునది; నీనామము; సర్వసౌఖ్యనివహకరంబున్ = సకలసౌఖ్యసముదయమును గూర్చునది; నీనామము; అమృతపూరము = అమృతము చేనిండియుండు

నది; నీనామము; నేఁడు = నేను; తలంతు = స్మరింతు; నిత్యుఁడ = జనన మరణములు లేనివాఁడా;

కృష్ణా! పాపములు హరించునదియు, సౌఖ్యములు గూర్చునదియు, అమృతముచే నిండియుండునదియు నగు, నీ నామము నే తలంచెదను.

క॥ పరులను నడిగిన జనులకు
కురుచ సుమీ యదియటంచు • గురుతగ నీవున్
గురుచవుడవై వేడితి వే
ధర పాదత్రయము బలిని దద్దయు కృష్ణా. 33

అ — పరులను = ఇతరులను; అడిగిన = యాచించిన; జనులకు = మనుష్యులకు; కురుచ సుమీ = లాఘవము సుమీ; అది = ఆయాచన; అటంచు = అని; గురుతుగ, నీవున్ = నీవును; కురుచవుడవై = పొట్టివాఁడవై; వేడితి వే = యాచించితివే; ధర = భూమియందు; పాదత్రయము = మూడడుగులు; బలిని = బలిచక్రవర్తిని; దద్దయు = మిక్కిలి.

తా — కృష్ణా! ఇతరులను యాచించుట లాఘవమని నీవే వామనుండవై బలిని మూడడుగుల భూమిని దానమడిగితివి కదా.

క॥ పాలును వెన్నయు మ్రుచ్చిల
రోలను మీ తల్లి గట్ట • రోషము తోడన్
లీలావినోదివైతివి
బాలుడవా బ్రహ్మగన్న • ప్రభుడవు కృష్ణా. 34

అ — పాలును = క్షీరమును; వెన్నయు = నవనీతమును; మ్రుచ్చిల = దొంగిలించగా; రోలను = రోటికి; మీ తల్లి = మీ యమ్మ; కట్ట = కట్టివేయఁగా; రోషముతోడన్ = కోపముతో; లీలావినోదివైతివి = ఆడుకొను వానివలెఁ గనఁబడితి

తివి; బాలుడవా=పిల్లవాడవా; బ్రహ్మకా=బ్రహ్మను; కన్న, ప్రభుడవు=దేవుడవు.

తా—కృష్ణా! పాలును వెన్నయును దొంగిలించితివని నిన్నునీతల్లి రోటి కిగట్టపసిబాలునివలె నటియించితివి గానినీవు కేవలము బాలుడవుకావు. బ్రహ్మను కన్న దేవుడవు.

క॥ రఘునాయక నీనామము
లఘుమతితోదలచగలనె • లక్ష్మీరమణా
అఘములు బాపుము దయతో
రఘురాముడ వైన లోకరక్షక కృష్ణా. 85

అ—రఘునాయక = ఓ రామచంద్రా; నీనామము=నీపేరు; లఘుమతితో=కొంచెపుబుద్ధితో; తలచగలనె=స్మరింపగలనా; లక్ష్మీరమణా=లక్ష్మీపతీ; అఘములు=పాపములు; బాపుము - దయతో - రఘురాముడవైన=రామచంద్రుడవైన; లోకరక్షక=లోకముల రక్షించువాడా.

తా— రఘురాముడవైన యోకృష్ణా! నీనామము కొంచెపు బుద్ధితో స్మరించగలనా! కృపబూని నాపాపముల బాపుము.

క॥ అప్పాయిత్తువు దయతో
నప్పాలను నతిరసంబు లనుభవశాలీ
యుప్పావనుగనుగొనవే
యుప్పవనుబ్రోవు వేంకటప్పాకృష్ణా. 86

(అర్థ తాత్పర్యములు సులభము.)

క॥ కొంచెపువాడని మదిలో
నెంచకుమీ వాసుదేవ • యిందిరనాథా

యంచితముగ నీకరుణకు
కొంచెమునధికంబుగలదె • కొంతయుకృష్ణా. 87

అ—కొంచెపు వాడని=అల్పబుద్ధిగలవాడని; మదిలో=మనస్సులో; సెంచకుమీ=భావింపకుమీ; వాసుదేవ=వసుదేవుని కొడుకగుటచే=కృష్ణున కీపేరు కలిగినది. యిందిరానాథా=లక్ష్మీపతీ; యంచితముగ=ఒప్పుగ; నీకరుణకు=నీదయకు; కొంచెము=కొద్ది; అధికంబు = గొప్ప; కలదె= యున్నదా; కొంతయు=కొంచెమైనా;

తా—కృష్ణా! నేను కొంచెపు వాడననినీ వెంచవలదు. నీదయకు కొద్ది గొప్పలున్నవా?

క॥ వావిరి నీభక్తులకుం
గావరమున నెగ్గుసేయు గర్వాంధులనుఁ
దేవవధించుట వింటిని
నీవల్లను భాగ్యమయ్యె నిజముగకృష్ణా 88

అ—వావిరి; నీభక్తులకుఁ = నీయందు మనసు నిల్పియున్న వారికి; కావరమున=క్రొవ్వుచేత; ఎగ్గుసేయు=కీడుసలుపు; గర్వాంధులనుఁ=గర్వముగల వారిని; దేవ; వధించుట=చంపుచుండుట; వింటిని; నీవల్లన=నీమూలమున; భాగ్యమయ్యె=భాగ్యము కలిగె; నిజముగ=సత్యముగ.

తా—కృష్ణా! నీభక్తుల కెగ్గుసేయు దుర్మతులను దండించి వారికి భాగ్యముల గూర్తువుకదా.

క॥ అయ్యా పంచేంద్రియములు
నుయ్యెలలను నూచినట్టులూరక నేనుఁ
చయ్యన నూగుచు నుంటిని
కుయ్యాలింపుము మహాత్మగురుతుగకృష్ణా 89

అ-అయ్యా=ఓభగవంతుఁడా; పంచేంద్రియములు= ఐదింద్రియములును; నుఱ్ఱ్యేలలను నూచినట్టులు=ఏట్లూపినట్లు; ఊరక; నేనుఁ; చయ్యన నూఁగుచునుంటిని=ఊఁగుచున్నాను; కుయ్యాలింపుము=మొఱవినుము; మహాత్మ=మంచి మనస్సుగలవాడ; నురుతుఁగ=నొప్పుగ.

తా—ఓకృష్ణా! పంచేంద్రియములెట్లూపినట్లూగుచుంటిని కావున నా మొరవిని రక్షింపుము.

క॥ కంటికి ఱెప్పవిధంబున
బంటుగదా యనుచు నన్ను బాయక యెపుడున్
జంటయు నీవుండుటచే
కంటకమగు పాపములను గడచితి కృష్ణా 90

అ—కంటికిఱెప్పవిధంబున=కన్నునకు ఱెప్ప యుండునట్లు; బంటుగదా= సేవకుడుగదా; అనుచు=అని; నన్ను; బాయక=విడువక; ఎపుడున్=ఎప్పుడును; జంటయు=అండ; నీవుండుటచే (నీవు+ఉండుటచే) కంటకమగు= ముళ్ళవలెనుండు; పాపములన=అఘములను; గడచితి=దాటితి.

తా—కృష్ణా! కంటికిఱెప్పవలె నీవు నాయండనుండుటచే ముండ్లవలెనుండు పాపములను నే గడచితిని.

క॥ యమునికి యిక నే వెఱువను
కమలాక్ష జగన్నివాస • కామితఫలదా
విమలమగు నీదు నామము
అమరఁగ దలచెదను వేగ • ననిశము కృష్ణా 91

అ—యమునికి=కాలునకు; ఇక=ఇంక; నేన్=నేను; వెఱువను= భయపడను; కమలాక్ష=కమలములవంటి కన్నులుగలవాడా; జగన్నివాస= లోకమంతయు నివాసముగాగలవాడ; కామితఫలదా=కోర్కెలుతీర్చువాడ;

విమలము = పవిత్రమైన; నీదు = నీయొక్క; నామము; అమరగ = బాగుగ; తలచెదను = స్మరించెదను; వేగ; అనిశము = రాత్రింబవళ్లు.

తా—కృష్ణా! నేననిశము నీపవిత్రమైననామముదలచెదను. ఇంకయును నకువెఱువను

క॥ దండమయా విశ్వంభర
దండమయా పుండరీక దళనేత్రహరీ
దండమయా కరుణానిధి
దండమయానీకునిపుడు దండముకృష్ణా! 92

అ—దండమయా; విశ్వంభర = భూమినిధరించువాడా; ...పుండరీకదళనేత్ర = తామరరేకులవంటికన్నులుగలవాడ; హరీ......కరుణానిధి = కృపకుస్థానమైనవాడ;........

తా—కృష్ణా! విశ్వంభరా! హరీ! పుండరీకదళనేత్రా! కరుణానిధీ! నీకువందనము.

క॥ నారయణ లక్ష్మీపతి
నారయణ వాసుదేవ నందకుమారా
నారయణ నినునమ్మితి
నారయణ నన్నుబ్రోవు నగధరకృష్ణా 93

(అర్థ తాత్పర్యములు సులభము)

క॥ తిరుమణి దురితవిదూరము
తిరుమణి సౌభాగ్యకరము త్రిజగములందున్
తిరుమణి నెట్టినమనుజుడు
పరమపవిత్రుండు భాగ్యవంతుడుకృష్ణా 94

అ—తిరుమణి=విష్ణుభక్తులు ధరించు నామము; దురితవిదూరము=పాపముల బాపునది; తిరుమణి; సౌభాగ్యకరము=భాగ్యముల గూర్చునది; త్రిజగములందున్ = మూడులోకములయందు; తిరుమణి; పెట్టిన=మొగమునందు ధరించిన; మనుజుడు=మనుష్యుడు; పరమపవిత్రుండు=పావనమైనవాడు; భాగ్యవంతుడు=సంపదగలవాడు.

తా—కృష్ణా! తిరుమణి సమస్త పాపములను బాపును సంపదల గూర్చును, అట్టి తిరుమణి ధరించినవాడు పావనుడును భాగ్యవంతుడు నై యుండును.

క॥ దుర్వార చక్రహస్తుడ
శర్వాణీ వినుత నామ • జగదభిరామా
నిర్వాణనాథ మాధవ
సర్వాత్మక నన్ను గావు సరసుడ కృష్ణా. 95

అ—దుర్వార=గొప్పదైన; చక్ర=చక్రమును; హస్తుడ=హస్తము నందు గలవాడా; శర్వాణీవినుత నామ=పార్వతీదేవిచే స్తుతింపబడు నామము గలవాడా; జగదభిరామ=లోకమునకు రమ్యమైనవాడా; నిర్వాణనాథ=మోక్షమునకు కర్త, మాధవ=లక్ష్మీదేవికి మగడా; సర్వాత్మక=అందరి యాత్మలను గలవాడా; నన్ను కావు సరసుడ.

తా—(అర్థమును బట్టి తాత్పర్యము గ్రహింపనగును)

క॥ శ్రీలక్ష్మీనారాయణ
వాలాయము నిన్ను దలతు వందితచరణా
ఏలుము నను నీబంటుగ
చాలగ నినునమ్మినాను సరసుడ కృష్ణా. 96

అ—(సులభము)

తా — ఓ లక్ష్మీనారాయణా! కృష్ణా! నిన్ను నేను తలచెదను. గావున బాలుగ నేలుకొమ్ము.

క॥ శ్రీధర మాధవ యచ్యుత
భూధరపురుహూతవినుత పురుషోత్తమ నీ
పాదయుగళంబు నెప్పుడు
మోదముతో నమ్మినాడ ముద్దులకృష్ణా. 97

అ — శ్రీధర; మాధవ; అచ్యుత; (విష్ణుమూర్తికి పేర్లు;) భూధర = భూమిని ధరించినవాడా; పురుహూతవినుత = ఇంద్రునిచే నుతింపబడువాడా; పురుషోత్తమ = పురుషులలో నుత్తముడైనవాడా; నీ = నీయొక్క; పాదయుగళము = పాదద్వయము; ఎప్పుడు = నిరంతరము; మోదముతో = సంతోషముతో; నమ్మినాడ ముద్దుల.

తా — ఓ కృష్ణా! ఓ శ్రీధరా! మాధవా! అచ్యుతా! పురుహూతవినుతా! పురుషోత్తమా! నీపాదములే నమ్మినాను.

క॥ శిరమున రత్న కిరీటము
కరయుగమున శంఖుచక్ర ఘనభూషణముల్
యురమున వజ్రపుపతకము
సిరినాయక యమరవినుత శ్రీహరికృష్ణా. 98

అ — శిరమున = తలపైన; రత్నకిరీటము = రత్నములతో చెక్కిన కళాయి; కరయుగమున = చేతులందు, శంఖు చక్రఘనభూషణముల్ = శంఖము చక్రమును భూషణములును; యురమున = వక్షమున; వజ్రపుపతకము = వజ్రముల హారము; సిరినాయక = లక్ష్మీదేవిమగడా; అమరవినుత = దేవతలచే నుతింపబడువాడా; శ్రీహరి

తా — కృష్ణా! నీకు శిరమున రత్నకిరీటము, చేతులయందు శంఖుచక్రములు; వక్షమున వజ్రహారముండును,

క॥ అందెలు పాదములందున
సుందరముగనుంచినావు • సొంపలరంగా
మందరధర మునిసన్నుత
నందునివరపుత్రనిన్ను నమ్మితికృష్ణా. 99

అ — అందెలు; పాదములందున = కాళ్లకు; సుందరముగ = అంద ముగ; ఉంచినావు = పెట్టినావు; సొంపలరంగా — సొంపుకనుపించునట్లు; మందరధర = మందరపర్వతమును ధరించినవాడా; మునిసన్నుత = మును లచేతుతింపబడువాడా; నందునివరపుత్ర = నందునిభాగ్యమువలనగలిగిన కుమారుడా; నిన్ను; నమ్మితి;

తా — కృష్ణా! ఓనందపుత్రా! మందరధరా! మునిసన్నుతా! నీవు పాదములకు అందెలు ధరించినాడవు.

క॥ కందర్పకోటి సుందర
మందరధరనామ • దేవ మధుసూదన రమా
సుందరవిగ్రహ మునిగణ
వందితమిముదలతు భక్తవత్సలకృష్ణా. 100

అ — కందర్పకోటిసుందర = కోటిమన్మథులయందముగలవాడా; మందరధరనామ = మందరధరుడను పేరుగలవాడా! దేవ; మధుసూదన = మధుడనురాక్షసునిజంపినవాడా; ఓసుందరవిగ్రహ = అందమైనవాడా; మునిగణవందిత = మునులచేనుతింపబడువాడా; మిము = మిమ్ము; తల చు = స్మరింతు; భక్తవత్సల = భక్తులయందు ప్రేమయుంచువాడా;

కృష్ణా! కోటిమన్మథుల యందముగలవాడా! మందరధరుడను పేరు గలవాడా! మధుసూదన! మునిసన్నుతా! నిన్ను నేను తలచెదను;

క॥ అనుదినము కృష్ణశతకము
వినినపఠించినను ముక్తివేడుక గలుగున్
ధనధాన్యము గోగణములు
తనయులు నభివృద్ధిఁబొందు తద్దయుకృష్ణా. 101

అ—అనుదినము = ప్రతిరోజు; కృష్ణశతకము = ఈకృష్ణశతకము; వినిన = విన్నను; పఠించిన = చదివినను; ముక్తి = మోక్షము; కలుగున్ = చేకూరును; ధనధాన్యము = ద్రవ్యము; పంటయు; గోగణములు = ఆవులమంద; తనయులు = కొడుకులు; అభివృద్ధి = వృద్ధి; పొందు = అగును; తద్దయము = మిక్కిలి.

తా—ప్రతిదినము ఈకృష్ణశతకము విన్నను; పఠించినను ధనధాన్యము గోగణము, సంతానమునభివృద్ధి బొంది, ముక్తికలుగును.

క॥ భారద్వాజస గోత్రుడ
గారవమున గంగమాంబకరుణా సుతుడన్
పేరు నృసింహాహ్వయుడన్
శ్రీరమణా నన్నుగావు సృష్టినికృష్ణా. 102

ఈకృష్ణశతకము వ్రాసినకవి తనపేరు తెలుపుచున్నాడు. (తా— కృష్ణా! నేను భారద్వాజగోత్రుడను గంగమాంబకు పుత్రుడను. నాపేరు నరసింహుడందురు నన్నురక్షింపుము.

కృష్ణశతకము సంపూర్ణము.

